కన్నీటి బిందువులోని రక్తకాసారాన్ని
నరనరాన నింపుకొని
అనేకానేక ప్రశ్నలకు సమాధానంగా
మోదుగుచెట్టు వికసిస్తోంది
ఎప్పటిలాగే...

తెలంగాణ కవిత్వం

# జంగ్

దానక్క ఉదయ్‌భాను



తెలంగాణ కవిత్వం

# జంగ్

దానక్క ఉదయ్‌భాను



తెలంగాణ కవిత్వం

# జంగ్

ప్రచురణ: తెలంగాణ విద్యార్థి వేదిక (TVV)

ప్రచురణ కాలం : డిసెంబర్, 2010

ప్రతులు : 1000

ముఖచిత్రం: రమణజీవి

ముద్రణ: చరిత ఇంప్రెషన్స్
ఫోన్ : 040-27678411

వెల: 40 రూ॥

ప్రతులకు :

దిశ, సహచర, నవోదయ, ప్రజాశక్తి, విశాలాంధ్ర మొ॥ పుస్తక కేంద్రాలలో,
**డి.ఉదయ్ భాను,**
రూమ్.నెం.112, ఎం.హెచ్-బి,
హైద్రాబాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయం,
గచ్చిబౌలి, హైద్రాబాదు-500046
సెల్: 9966989083, 9963709032.

## అంకితం

కాగుతున్న కాలం కత్తిపదునుకు
తమ రక్తంతో సవాలిసిరిన
తెలంగాణా అమరవీరులకు...
ఎండిన వాగొడ్డున
శంఖారావం పూరిస్తున్న
కపిష్కలకు...

## కవితల వరుస

# నా మాట

ఈ భూమ్మీద పుట్టిన మనుషులందరికీ సాధారణంగా ఒకే మరణం ఉంటుంది. కానీ తెలంగాణాలో ఒక్కొక్కరికి కొన్ని వందల మరణాలుంటాయి. ప్రతిరోజూ చనిపోతూ చనిపోతూ ఏదో ఒకరోజు చనిపోయి చనిపోవడాలను ఆపేస్తారు. ఇక్కడ పుట్టడమంటే చావును మెడలో వేసుకుని పుట్టడం. ఆకలిబాధలను వెంటే తెచ్చుకోవడం. ఇక్కడ బతకడమంటే ఎండిన చెరువులో చేపపిల్లలా గిలగిలలాడటం. ఇక్కడ నడకలంటే కన్నీటి బురదలో రొప్పుతూ పోవడమే. ఇక్కడి నేలపై నిలబడటమంటే అస్థిపంజరమై వేలాడటమే. ఇన్నివున్నా మట్టిగుండెల్లో లిఖించుకున్న శతాబ్దాల పోరాట వారసత్వం తెలంగాణాకు చెరిగిపోని ఆస్తి. అటువంటి నేల మీద మనిషన్నవారెవరైనా అసంకల్పితంగానే స్పందించడం ఉంటుంది. నేనూ ఆ క్రమంలో రాసుకున్న కవితలే ఇవి.

–దానక్క ఉదయ్ భాను

# సర్వస్వం సాయుధమైన చోట

నేను యిప్పుడు యిక్కడ ఉదయ్ భానును పరిచయం చెయ్యడంలేదు. తెలంగాణ మీకు తెలుసు. తెలంగాణాని ఉదయ్ భానుని వేరుచేసి మాటాడలేను. అందుకే తెలంగాణని– అదీ పోరు తెలంగాణని తెలిసిన మీకు ఉదయ్ భానుని ప్రత్యేకంగా పరిచయం చెయ్యాల్సిన అవసరం లేదు.

కాకపోతే ఓ చిన్నమాట. జీవితం అట్టడుగు నుంచే రచయితలు రావాలంటాడు గోర్కీ. ఉదయ్ భాను అక్కడినుంచే వచ్చాడు. టేకులపల్లి పాలమూరులోవుంది. పాలమూరు రాజధానినుండి రాయి విసిరితే తగిలేంత దూరంలో వుంది. పొక్కిలైన నేల పొత్తిళ్లలోంచి బతుకును గంపలవెట్టుకోని వలస పోతున్నదెవరని ఎవరినైనా అడుగు. అది పాలమూరంటారు. అదిగో అక్కడి నుంచే వచ్చాడు ఉదయ్ భాను. అక్కడినుంచే రాస్తున్నాడు, ప్రవహిస్తున్న నెత్తురుటేర్ల ఒడ్డున కూర్చొని వెలుతురు పూల వనాలకోసం ఎదురుచూస్తూ...

రాయటానికి ముందు గాయపడ్డ కాలాన్ని చదివాడు. తాను చదివిందాన్ని మాటల్లో పేర్చాడు. ప్రతిమాటా నెత్తుటి వాసన కొడుతోందన్నారు చదివినవాళ్లు, చదవగా విన్నవాళు . ఆ తప్పు తనది కాదంటాడు భాను. గాయపడ్డ కాలానిదంటాడు. నిజమే అనిపిస్తుంది. చరిత్రలో చారిత్రక పత్రం ఏదైనావుందంటే అది గాయపడ్డ కాలం మాత్రమే. ఈ రోజు గాయపడ్డ తెలంగాణ ఒక చార్రిత్రక పత్రాన్నే రాస్తోంది. ఈ కవితలు అక్కడ నుంచే పుట్టుకొచ్చాయి. ఆ చారిత్రక పత్రాన్నుంచే, దాని గర్భం నుంచే తన్నుకొచ్చాయి, కాలుతున్న కాలంలో రాల్చబడ్డ ఆకుల్లా, చారిత్రకమెట్ల పెదాలపై పెకిలి పారుతున్న ఫిరంగిమోతల్లా, ఆశయాలతో దండలల్లి ఉద్యమాలకు హారతులు వేస్తో...

ఆధిపత్య రాజకీయం, ఆధిపత్య సంస్కృతి, ఆధిపత్య భావజాలం అనేక ముసుగులు తొడుక్కొని ముందుకొస్తాయని చరిత్ర చెప్పిన సత్యం. అలాంటి ముసుగుల్లో ఒక ముసుగు సమైక్యాంధ్ర. ఈ ముసుగు కోస్తా, రాయలసీమ అగ్రకుల పెట్టుబడిదార్ల, వ్యాపార వర్గాల, దోపిడీదార్ల ప్రయోజనాలకోసం ఏర్పడిందని కాస్త బుద్ధి, జ్ఞానం వున్న ప్రతివొక్కడికీ తెలుసు. ఈ పెట్టుబడిదార్లకి తెలంగాణలో బోలెడు ఆస్తులున్నాయి. ఫ్యాక్టరీలు ఉన్నాయి. వ్యాపార సంస్థలున్నాయి. అవి కాపాడబడటం కోసం పుట్టుకొచ్చిన నినాదం సమైక్యాంధ్ర.

అసలు 'ఆంధ్ర ప్రదేశ్' పుట్టుకే అనేక సందేహాలతో, అనేక ప్రశ్నలతో, చివరకు "పొంతన కుదరకపోతే విడిపోవచ్చు"నే క్లాజుతో ఏర్పడింది. ఈ రోజు తెలంగాణా పొంతన కుదరదు విడిపోదామంటోంది.

నా చిన్నతనంలో రాజోళి పేరు విన్నాను. ప్రకాశం జిల్లాలోని మా యింట్లో మగ్గం గుంటకి రాజోళి తెలుసు. సుంకేశుల వరద రాజోళి చేనేత బతుకునే ధ్వంసం చేసింది. సుంకేశుల వరద శ్రీశైలం డ్యాం వెనుకతట్టు నీరు అలంపూరు రక్షణ గోడని చీల్చిన సందర్భం. కోస్తా, రాయలసీమ పెట్టుబడిదార్ల దాహం తీర్చడానికి బలైన తెలంగాణా గ్రామాలెన్నో. రాజోళీలు ఎన్నో. నీట మునక తప్పించుకోలేని జోగులాంబలకు తెలుసు.

గాయపడ్డ కాలంలో యివన్నీ వర్తమానాలే. సింగరేణి ధ్వంసం మొదలు ఓపెన్ కాస్ట్ విధ్వంసం దాకా, ధ్వంసం కాని రంగంలేదు. ధ్వంసం కాని భాగంలేదు. అంతా గాయపడ్డ కాలమే. చరిత్ర, సంస్కృతి, సాహిత్యం, జీవితం, అంతా ఆ కాలగర్భంలో మండుతున్న అగ్ని గుండాలే. మాయని గాయాలే. ఆ కాలమంతా భానుకు పరిచయమే. ఆ కాలం ముందుమాటా, వెనుకమాటా రెంటిమధ్య దాగిన అసలుమాట...అంతా తెలిసిన నిజాలే.

గాయపడ్డ తెలంగాణా రాస్తున్న చారిత్రక పత్రం పాత పాఠ్యపుస్తకాలన్నీ వదిలేసిన లోతుల్లో వెళ్తోంది. ప్రపంచానికి తన వాస్తవాన్ని పరిచయం చేస్తోంది. తెలంగాణాలో పుట్టిన ఏ కవితనైనా అడుగు అది దాని మెదడు కేసి మాత్రమే చూడొద్దంటుంది. తన గుండె తలుపులు తెరవమంటుంది. అలా అడిగినవే భాను కవితలు.

భాను అన్నట్లు చిట్టచివరి నమ్మకాలు చిట్లిపోతున్నప్పుడు యుద్ధాలు పుట్టడం తప్ప మరోమార్గం లేదు. చరిత్రంతా తన అనుభవాలను ఉదాహరణలు చూపుతో అదే మాట చెప్పింది. కాదనే జ్ఞానులు ఈ భూమ్మీద వుండొచ్చు. వాళ్ల జ్ఞానానికి ఓ నమస్కారం పెడదాం. తెలంగాణాలో తనకు ముందు, తనతోపాటు జరిగిన, జరుగుతున్న ప్రతి సందర్భం భానును కుదురుగా వుంచలేదు. "ఇక్కడి సర్వస్వం సాయుధం" అన్న తెలంగాణా బతుకుపోరులో, ఆ పోరు బాటలో తాను, తన అడుగుల ముద్రలు వుండాలనుకొన్నవాళ్లతో తానూ ఒకడయ్యాడు.

భాను యుద్ధాన్నే కవితల్లా అల్లాడు. బోకిబిచ్చ అంచుల్ని పదును పెడుతో, మొండి గోడల నిండా వేలాడుతున్న నెత్తుటి చుక్కల్ని కంటి నిండా నింపుకుంటో...

కవిత్వం రాయడమంటే, అందులోనూ యుద్ధాన్ని రాయడమంటే తాను పుట్టిన నేలమీది ప్రజల ముందు నిలబడి బతుకో, చావో మీతోనే అని ప్రతిజ్ఞ చెయ్యడం. సమర భూమిలో తల్లి చెరను విడిపించడానికి తనని తాను వెలిగించుకోనటం. బతుకుని రేపటి అందమైన లోకం కోసం ఈరోజు ముడుపు కట్టడం. సాహసమే అది. త్యాగమే అది. రెండూ కలిసిన పోరాటమే అది.

మా బతుకు, భూమి దోపిడీదార్ల సొత్తు కావనటం మామూలు మాట కాదు. అదో నినాదం. పోరు చరిత్ర వెచ్చటి దేహం కింద కన్ను తెరిచిన అగ్గిపిట్ట కూసిన నినాదం అది. అ నినాదం మామూలుది కాదు. యుద్ధం. యుద్ధ నినాదం. పాలు లేని తల్లి రొమ్ము నుంచి రాని పాలకోసం శిశువు ఏడ్పు. అది ఏడ్పు కాదు, రేపటి స్వప్నాలను పాడిన పాట. ఒక శంఖారావం. ఒక ఒడిసెలరాయి. ఉద్యమ పుష్పం రాల్చిన పుప్పొడిగుట్ట. పెకిలిపాడిన ఫిరంగి మోత. ఆగని రాగాల ఊట. అవును అదంతా ఒక్క నినాదమే. గొంతులు మాత్రం లక్షలు...కోట్లు...

ఆ నినాదం తెలంగాణ అంతా ముద్దాడిన ఎర్రటి కిరణాల నెత్తుటి తడి. కవిత్వం నీతో మాట్లాడటం, నీ ముందు మనసిప్పడం, నీ కళ్లని నీళ్లతో నింపడం, నీ వంట్లోని నెత్తుటి వాగుల్లో ఆటుపోట్లని సృష్టించడం అంటే యిదే. బతుకు తనని తాను రాసుకోవటంలో మాత్రమే ఆ అద్భుతం వుంటుంది. బాబేఝరిపై నిలబడి కొమురం భీం విసిరిన సవాల్‌లా! భాను మాటల్లోనే మనిషికోమట్టి, మట్టికోగొంతు, గొంతుకోగర్జన, గర్జనలో యుద్ధం...ప్రజా శత్రువు చితిని సిద్ధం చెయ్యడానికి యింకేం కావాలి.

ఏ ప్రశ్నా చిన్నదేంకాదు. ఒక్క తల్లి బిడ్డలమైనప్పుడు యివతలిరొమ్ము పాలనూ అక్రమంగా తాగేస్తున్నావెందుకని సమైక్యాంధ్రకై నినదించేవాళ్లని ప్రశ్నించడం చిన్నది కాదు. ప్రశ్న ఎప్పుడూ చిన్నది కాదు. కలిసి వుంటే కలదు సుఖంలో సుఖం ఎవరిది? తెలంగాణావారిది మాత్రం కాదు. భాషా, బతుకు వేరుకాదు. బతుక్కో భాష వుంది. ఆధిపత్య సంస్కృతి అనేది బతుకుపైన ఎక్కుపెట్టిన విషపు బాణం. విశాల భావనకి విశాలాంధ్రకి వున్న తేడా చాలా పెద్దది. విశాలాంధ్ర విశాల భావనకి పర్యాయపదం కాదు. కానేరదు.

తెలంగాణ విడిపోతే నక్సలైట్లు పెరుగుతారనటం దోపిడీదార్లకు వత్తాసుపలకటమే. ఆరుద్రపురుగులు ప్రకృతి ప్రేమతో పెంచుకున్న గొప్ప అవసరాలు. అంతే గొప్ప అంగాలు. నక్సలైట్లూ అంతే. బతుకు పోరువనంలో పుష్పించిన పుష్పాలు. అందమైన అద్భుతాలు. పాలకవర్గాలు పార్లమెంట్లలో, అసెంబ్లీలలో వుంటారు. నక్సలైట్లు ప్రజల మధ్య ప్రజల గుండెల్లో వుంటారు.

నాది నాకివ్వు అని అనటం, నీది నువ్వు తీసుకో అని అనటం, నీది నాకేమీవద్దు, నువ్వూ నాదేమీ తీసుకోవద్దు అని అనటం నేరం కాదు. నీతి శాస్త్రం అది నేరం అనదు. న్యాయ శాస్త్రం అది నేరం అనదు. రాజ్యాంగం అది దుర్మార్గం అనదు. శాంతి భద్రతల సమస్య కాదు. కొన్ని వందల ప్రాణాల్ని బలిగొనే అంశం కాదు. చాలా మామూలు నీతి. చాలా సహజమైన న్యాయం. సహజమైన ఆకాంక్షల్లో చాలా సహజమైన ఆకాంక్ష. ఆ సహజమైన ఆకాంక్ష కోసం విద్యార్థి లోకంలో అన్ని ప్రాణాలు అంతం కావాల్సిన అవసరం లేదు. పాలకవర్గం ప్రజల పక్షాన, వాళ్ల ఆకాంక్షల పక్షాన వుంటే విద్యార్థులు తమ ప్రాణాల్ని తెలంగాణాకోసం త్యాగం చేసేవాళ్లు కారు. నిజానికి అన్ని వందలమంది విద్యార్థుల్ని బలితీసుకుంది పాలకవర్గం, పెట్టుబడిదారి వర్గం.

తెలంగాణావాళ్లు, ఆంధ్రావాళ్లు విడిపోయి కలిసివుండాలనడం ప్రాంతీయ దురభిమానం కాదు. రాష్ట్రాన్ని ముక్కలు చెయ్యటం కాదు. అవసరమైన, అత్యంత సహజమైన మానవ సంబంధాల నాగరికమైన పద్ధతి. నాగరికమైన పద్ధతులేవి దోపిడీవర్గాలకి, దోపిడీ పాలకులకి నచ్చవు.

తెలంగాణ యుద్ధ వికసిత పుష్పం-"వెళ్లిపో! ప్రకృతి కన్నెర్రజెయ్యకముందే" అని అనేదాకా సాగదీసుకోవటం ఎవ్వరికీ మంచిది కాదు. అందుకే భాను కవితలు అంటాయి-ఎండుటాకులు యుద్ధ లేఖలైన చోట, కాంతి పుంజాలు విముక్తి పొందుతున్న చోట, తడవటం కంటే మరణమే వెచ్చనైన చోట, మీ తుపాకీ గురి ఎటువైపు పెట్టగలరు? ఖచ్చితంగా మీ కణతపై మీరు గురి పెట్టుకొంటారు. అన్ని ప్రాంతాల తెలంగాణా ద్రోహులకు భాను కవితలు చేస్తున్న హెచ్చరికయిది.

"ఏ కవికైనాసరే అతని చుట్టూ ఓ సమాజం, ఆ సమాజానికో చరిత్రా, ఆ చరిత్రకో పరిణామం వుంటాయి. సామాజిక చారిత్రక పరిణామ గమనంలో కవియొక్క సాహిత్య స్థానం నిర్ణీతమౌతుంది. కవి ప్రగతిశీలి, ప్రతిభాశాలి అయితే ఈ గమనాన్ని మరింత వేగవంతం చేస్తాడు"- శ్రీశ్రీ అన్న ఈ మాటల్ని శ్రీశ్రీ లాగనే రాస్తున్న వ్యాసంలో చలసాని ప్రసాద్ కోట్ చేస్తూ "శ్రీశ్రీకి యిది అక్షరాల వర్తిస్తుంది" అని అంటాడు.

ఆ మాటల్నే వయసులో చిన్నవాడైనా ఉదయ్ భానుకు వర్తిస్తాయని నేను అనుకొంటాను. తెలంగాణ వర్తమాన చరిత్ర. ఉదయ్ భాను ఆ చరిత్ర విద్యార్థి మాత్రమే కాదు ఆ వర్తమానంలో భాగం కూడా. అతని జంగ్ వర్తమాన తెలంగాణా ఆకాంక్షకి, పోరాటానికి అక్షర రూపం. తెలంగాణా కవిత్వానికి ఎంత శక్తివుందో నిరూపించే కవితా సంపుటి.

నాకు జీవితాన్ని గానం చేసిన కవిత్వమంటే యిష్టం. జీవితం చేసే యుద్ధాన్ని గానం చేసే కవిత్వమంటే మరీమరీ యిష్టం. భాను కవితా సంపుటి ఆ రెండూ చేసింది. జీవితాన్ని, దాని పోరాటాన్ని ఉన్నతంగా చూపింది. అందుకే ఈ కవితల్ని నేను యిష్టపడ్డాను. నా యిష్టాన్ని మీతో పంచుకొంటున్నాను.

ఈ కవితలు బంధూకు కొసకు తగిలించుకొన్న నెలవంకలు. పారిన నెత్తుటి ఏరులు. ప్రజల ఆకాంక్షలకై ఎలుగెత్తిన తెలంగాణా శ్వాసలు. అందుకే కావచ్చు వీటిల్లో సూటిదనం ఉంది. సందేహాలు లేవు. నిలదీసే ప్రశ్నలున్నాయి. రాజీపడే నాన్చుడు ధోరణులు లేవు. కొడవళ్లని నూరుకునే శక్తి వుంది. ఎందుకట్టా నూరుకోవటం అని ఎవరన్నా అంటే, "బతుకును ఎవరో బజారు చేస్తుంద్రు" అని చెప్పే స్పష్టతవుంది. "కొమ్మలేదు, గూడూ లేదు, పలుగురాయినై నేను తప్ప" అని అన్నది ఓ పక్షయినా ఆ మాటలు తెలంగాణాలోని అశేష పేద జనాంగానికి వర్తిస్తాయి.

ఇది తెలంగాణా జంగ్. దగాపడ్డ బతుకుల జంగ్. సర్వస్వం సాయుధమైన చోట పోరాటానికి విజయమేతప్ప పరాజయం లేదు- "జంగ్" ఆ విజయంలో తన స్థానాన్ని పదిలపరుచుకొంటుంది. అందుకే ఉదయ్ భానుకు నా విప్లవాభివందనాలు....

-జి. కళ్యాణ రావు.

# గర్భం దాల్చిన మేఘం

వేల స్వప్నాల సమాధి కనుపాప
ప్రవహిస్తున్న నెత్తురుటేర్ల ఒడ్డున కూర్చొని
వెలుతురు పూల వనాల కోసం ఎదురుచూస్తోంది

కాలుతున్న కాలంలో రాల్చబడిన ఆకులు
చెట్టు పాదాలవద్ద
కోటి ఆకాంక్షలతో
కొత్త చిగుర్లను నినదిస్తున్నాయి

పాటపాడిన గొంతు
పదిహేడు ముక్కలైనా
ఒక్కో భాగం
నాలుక్కోట్ల గొంతుల రణన్నినాదాన్ని
కసిదీరా పాడుతోంది

చెట్టుపైవాలిన వడ్రంగిపిట్ట
చెట్టేనాదని కడుపును తొలుచుకు వెళుతుంటే
మట్టివేళ్ల జీవశక్తి రంగరించుకున్న ఆకులకు
బాకులయ్యే శక్తి
గాలే నూరిపోస్తోంది

గోధూళి
అస్తమయసూర్యుని యుద్ధతంత్రాన్ని
చీకటి వాకిట్లో ఉపన్యసిస్తోంది
రాలిన చుక్కలు
సూర్యున్ని మోసుకురావడానికి
బయల్దేరిపోయాయి

బతుకువీణను
ఎడారి
ఒంట్లోపెట్టుకుని
కరువువేళ్లతో మీటుతుంటే
స్మశాన నిశ్శబ్దం వెచ్చగా వెలువడుతోంది

బీడుభూముల్లోని గడ్డిపరకలు
అరుణవర్ణాకాశపు కొంగుకింద
చారిత్రక సత్యాల్ని విశ్వసిస్తున్నాయి

నువ్వు+నేను= నువ్వే
నేను-నువ్వు= నేను
నన్నొక్కన్నే ఉండనివ్వు

పాము
గుడ్లనేకాక గూడునూ మింగేస్తూంటే
రక్తం గడ్డకట్టుకుపోయిన పిచ్చుక
ముక్కును ముంగీస నోరు చేసుకుంటోంది
మా రెండుకళ్లనీళ్లు
పరాన్నభుక్కు కడుపులోకి వెళ్తున్నాయి




అవి నీళ్లుకావు
కాలుతున్న శవాలూ,వాటి కలల సమ్మిళిత మిశ్రమం

ఓ కాటికాడి కబోదీ!
హృదయం ఆకాశస్వచ్ఛతతో తెరిచి
మానవత్వపార మాత్రమే మిగిలేదాక
కళ్లను నులుముకుని
మోకాళ్లపై కూర్చొని
పిడికెడు మట్టిని చేతిలోకి తీసుకుని చూడు
వలసెల్లిన పాదాలు కార్చిన కన్నీటి చారలు
రాశులు రాశులుగా కలల శకలాలు
పగిలిపోయిన కనుగుడ్లు
బోకిబిచ్చలైన అటికె,గురుగులు
తడితడిగా తగిలే నెత్తుటివాసన
ఆకలికేకల సమూహాలు
పక్కనే పొరాడుతున్న పోరాటం
కన్పిస్తాయి

కాలం స్తబ్దుగా ఉందంటే
ఓటమే రాజు అయినట్లు కాదు
గర్భం దాల్చిన మేఘం గంభీరంగానే ఉంటుంది
శాంతి చెంపలు ఎర్రబారకముందే
యుద్ధం తీరం చేరుతోంది



# శత్రువుకొక లేఖ

ఇక్కడ భూమే మాట్లాడుతోంది
ప్రకృతే యుద్ధం చేస్తోంది
ఓ నా ప్రియమైన శత్రువా!
నీ తుపాకీ గురి ఎటువైపు పెడతావ్?

కొమ్మపై పావురాయి గొంతులో
కువకువల్ని హత్యచేస్తావా?
చిగురించే కొమ్మ ఉండనే ఉంది
కుట్రలతో కొమ్మనీ ఛేదిస్తావా?
మళ్లీ కాసే చెట్టు ఉండనే ఉంది
ఇవేవీ కాదని చెట్టునే మొదటికి నరికేస్తావా?
మట్టిలో ఇంకిపోయిన వేళ్లు అలానే ఉంటాయి
ఇనుపగోళ్లు దించి
వేళ్లనూ పెకిలించేయాలనుకుంటున్నావా?
ప్రశ్నించే భూమి మిగిలే ఉంటుంది
ఓ నా ప్రియమైన శత్రువా!
నీ లాఠీని ఎక్కడ వాలుస్తావు చెప్పు?

ప్రకృతే పోరాటం చేస్తున్నప్పుడు
ఈ నేలపై ప్రతీదీ





ఉద్యమవిద్యలో సుశిక్షితమే
ఇక్కడి మట్టిరేణువులు
మట్టిపెళ్లలవుతున్నాయి
మట్టిపెళ్లలు మరఫిరంగులౌతున్నాయి
పలుగురాళ్లు అంచులు నూరుకుని
కిరణాల వాడిని సంతరించుకుంటున్నాయి
పిల్లగాలీ సాయుధమై
పోరాటాన్నెక్కుపెడుతున్నది
గుండెనిండా బూడిద నిండిన మట్టిపొయ్యి
'సర్కారు'తుమ్మ ముళ్లను
కాల్చడానికి సిద్ధమైపోయింది

ప్రియమైన శత్రువా!
నీకొక రహస్యం చెప్తా విను
లాఠీలు తలను తాకినప్పుడో
గుండ్లు గుండెల్లోంచి దూసుకెళ్లినప్పుడో
రాలిన నెత్తురు చుక్కలు
మట్టిలో టీచర్లై పోరుపాఠాలు చెప్తున్నాయి
అందుకే ఇక్కడి సర్వస్వం సాయుధం

ఇప్పుడు చెప్పు
నీ తుపాకీ గురి ఎటువైపు పెట్టగలవ్?
నీ కణతపై నీవు గురిపెట్టుకోవడం తప్ప!



## బోకిబిచ్చ

నేను తెలంగాణాను
నను రారమ్మని ప్రియంగా పిలిచిన
స్మశానపు చెలి కౌగిలిలో బంధీని

నేను మోసపోయిన ఎట్టిదాన్ని
కబేళాలో వేలాడుతున్న
మాంసపుముద్దను

నేను వివస్త్ర భూమిని
నడిబజారులో పరిగెత్తుతున్న
నగ్నదేహాన్ని

ఒళ్లంతా పగుళ్లతో
పగుళ్లనిండా కళ్లతో
కళ్లనిండా నీళ్లతో
డొక్కల్లో సొళ్లను లెక్కబెడుతున్నదాన్ని

నేను తెలంగాణాను
పొక్కిలైన నేల పొత్తిళ్లలోంచి
బతుకును గంపలవెట్టుకొని
వలసపోతున్న పాలమూరును



నేను తెలంగాణాను
కూలిపోయిన మట్టిగోడలనడుమ
భవిష్యత్తును కలగంటున్న
బోకిబిచ్చను

నేను తెలంగాణాను
పానం పుల్లశీలిన
పల్లెటూరి దేహాన్ని

నేను తెలంగాణాను
ఎడారి చిత్రపటంలో నిర్జీవాన్ని
గుండెలవిసేలా రోధిస్తున్న
తడారిన గొంతును

నేను తెలంగాణాను
ఇంకిపోయిన ఆశలగుంతను
రైలు పట్టాలపై
ఛిదమైన
గుర్తుతెలియని శవాన్ని

నేను తెలంగాణాను
నా నేలలో...
నా మట్టివాసనలో...
పరాయిదాన్నై
కాందిశీకురాలిగా మిగిలినదాన్ని

నేను తెలంగాణాను
అమావాస్యరాతిరిలో
వికటాట్టహాసం చేస్తున్న
స్మశానపు పాదాలవద్ద
మౌనంగా రోధిస్తున్న నయనాన్ని

ఎడారిఓడ
డేరాలేపుడేగాదు
పండుకున్న జాగనూ మింగేసి
కుండలున్న నీళ్లనూ తాగేస్తే
మూర్ఛిల్లిన కంటిపాపను

ఇక తప్పదు
గుండెపగిలిన బోకిబిచ్చల అంచులను
పదునుపెడ్తున్నాను
మొండిగోడల ఒంటినిండా వేలాడుతున్న
నెత్తురుచుక్కల్ని
కంటినిండా నింపుకుంటున్నాను
పగిలిననేల పరిమళించేదాకా
కన్నీళ్లతో కడుపునింపుకునైనా సరే
యుద్ధాన్నే ముద్దాడుతుంటా
గమ్యస్థానం చేరాలంటే
గాలికూడా సాయుధమవ్వాల్సిందే.







## అప్రయత్నంగా

కవిత్వానికి నెత్తుటివాసనొస్తోందంటే
తప్పు కవిదికాదు
గాయపడ్డ కాలానిది

భాషలో కత్తులూ కటారలూ దొర్లుతున్నాయంటే
కారణం భావాల్లో లేదు
పగులుతున్న నేలలో ఉంది

అడుగు అడుగులో యుద్ధాలు మొలుస్తున్నాయంటే
పాదాల ప్రమేయమేమీ లేదు
చివరి నమ్మకమూ చిట్లిపోవడమే

ఆత్మగౌరవ జెండా రెపరెపలాడుతున్నదంటే
ఒక మీటర్ వ్యాసార్థపు బట్టముక్కపాత్రేమీ లేదు
ఆగిన శ్వాసలు గాలితో కలిసి వీయటమే

కాలం పగిలేటట్లు నోరు ఉరుముతున్నదంటే
తప్పు నోటిదేంకాదు
అర్ధరాతిరి అమ్మ మరణానిదే

నేనిక్కడ కుదురుగా ఉండలేను
ప్రశాంతంగా ప్రవచించనూలేను
ఎండిన గుండె చెరువునుండి
ఆవేశం మాత్రమే అలుగువారుతోంది







## ఎడారి చెట్టుకొమ్మ

ఒరంగట్టుపై రైతుశవాన్ని మోస్తున్న
పగిలిన ఒరిమడిని దాటి
స్మశానం ఊళ్లోకి ప్రవేశించింది
ఆపద్బాంధవుడై వలస
ఇంటిముందర నిలబడింది
గాలి కత్తులు ధరించి
మిగిలిన జీవాలకోసం గాలిస్తోంది
ఇంటికేసిన తాళంకప్ప
పగలే అమావాస్యను కురుస్తోంది
సానిపిచల్లని వాకిలి
సచ్చిన మా నాయనమ్మ ముఖమే
మా ఊరొక ఎడారి చెట్టుకొమ్మ
పూలురాలిన అనాథజాడ
కలల శవాలు వేలాడుతున్న మొండిగోడలు
గతం జ్ఞాపకాల్ని భద్రపరుస్తున్నాయి
గూట్లో కోయిలమ్మ శవంలా దీపం
జవసత్వాలు లేక ఆరిపోయింది
ఊరెనక దుబ్బతొవ్వలో
పరుచుకున్న అడుగులనిండా
కన్నీటి పుష్పాలు వికసిస్తున్నాయి

పుల్లరిపాదలనీడ గుండెకు హత్తుకుంటోంది
లేగచూపుల్ని నెమరువేస్తున్న బర్లకొట్టంలో
తోడేళ్ల అవులింతలు
నల్లకుక్కకు కాన్పుచేసిన
సగంకూలిన ఇంటిగోడ
వదిలిపోతూ విడిచివెళ్లిన చివరి చూపుల్ని
కళ్లనిండా నింపుకుని ఎదురుచూసే
తలుపుసందులు కనుపాపలు
గాయం మానని కాయం ఇంటిగడప
తనకుతానే పెకిలించుకుని
యుద్ధానికి సిద్ధమౌతోంది







# మరో బాబేర్ఘురి

ఒక్క నినాదం
బాబేర్ఘురి ఆర్ట్సుకాలేజీముందు ఉదయించి
ఎర్రటి కిరణాలు పెదాలను ముద్దాడుతుండగా
చేసుకున్న వాగ్దానం

ఒక్క నినాదం
పోరుచరిత వెచ్చని దేహంకింద
కన్నుతెరిచిన అగ్గిపిట్ట
పదికొమ్మలపైనుండి కూస్తున్న యుద్ధం

ఒక్క నినాదం
పాలులేని తల్లిరొమ్ముకు
ఉరితీయబడ్డ దేహంలా వేలాడిన నిన్నటి శిశువు
రేపటి స్వప్నాన్ని పాడిన పాట

ఒక్క నినాదం
బీడువారిన భూములన్నీ
గుత్తులు గుత్తులుగా చిగిర్చిన
కత్తుల కవాతు శబ్దం

ఒక్క నినాదం
ఎండిన వాగొడ్డున
కపిష్కలు పూరిస్తున్న శంఖారావం

ఒక్క నినాదం
కడుపులో ఆకలి
బాధనంతా రంగరించుకొని
ఒడిశెలరాయిలా దూసుకొచ్చిన కేక

ఒక్క నినాదం
ఓయూ నడిబొడ్డున
అంకురించిన ఉద్యమపుష్పం రాల్చిన
పుప్పొడిగుట్ట

ఒక్కనినాదం
పదిజిల్లాల గొంతు
చారిత్రక మెట్లపెదాలపై పెకిలి
పాడుతున్న ఫిరంగి మోత

ఒక్కనినాదం
పాటగొంతులో తూటా దిగినా
ఆగని రాగాల ఊటల మూట

ఒక్క నినాదం
'త్యాగం మా ఆయుధం
శత్రువెవ్వరైనా...
తలొగ్గాల్సిందే'

(బాబేఝురి : కొమురంభీం నైజాంపై పోరాటానికి ఏర్పాటుచేసకున్న యుద్ధ కేంద్రం)






## చెట్టు

చిందిన రక్తపుచుక్కలు
మట్టిగుండెల్లో లిఖించిన చరిత్ర
సలసల కాగీకాగీ
ఆర్ట్సుకాలేజీముందు
చెట్టై పుష్పించింది

ఉరేసుకున్న దేహాలను
భారంగా మోసిన కొమ్మలకు
పిడికిళ్ల పూత
సూరీళ్ల కాత

ఒక్కసారి
చెట్టుకొమ్మలూగితే
ఆకులసందున నిద్రిస్తున్న పిల్లగాలి పయనమై
ఖమ్మం చెవిలో యుద్ధవ్యూహం పంచి
ఆదిలాబాదు గుండె తట్టి
పాలమూరును వింటినారిపై నిలిపి
చెట్టుపాదాలవద్దకు
ప్రతిధ్వనై తిరిగివస్తోంది

కొమురంభీం
బాబేఝురిపై నిలబడి
సవాలు విసురుతున్నట్లుందీచెట్టు

ఇవాళ
చెట్టుకింద ఎన్నిముచ్చట్లు
చెట్టు గురించి ఎన్ని ఊహలు
చెట్టుపై ఎన్ని ఆశలు
ఎనిమిదికోట్ల కళ్లచూపులు
చెట్టుమొదలుకు కట్టేసి ఉన్నాయి

'అన్ని పక్షులూ' చెట్టుమీదనే వాలుతున్నాయి

వేల కిలకిలలు...
లక్ష కువకువలు...
రాతిరి అలావు ఆడుతున్నది
పగలు పాటపాడుతున్నది
మండుతున్న నెగళ్లవైపు తిరిగి
మూతి తిప్పుకుంది 'చలి'
తోక ముడుచుకుంది 'పులి'
ఇప్పుడు చెట్టు రూపు మార్చుకుంటోంది
జిల్లాల తనువెల్లా ప్రవహించాలని బయల్దేరుతోంది
నవ లాంగ్‌మార్చ్
నిన్నటి విజయాన్నిక్కడ ప్రతిక్షేపిస్తే
ఎంతబాగుండు
అయ్యమ్మకు దక్కలేదు
నేనైనా కాసేపు
ఆ నీడలో కునుకు తీస్తుంటి





## తెలంగాణ దసరా

ఊరవతలి జమ్మిచెట్టు
ఒంటరిదయింది
ప్రపంచం నుండి వేరుచేయబడ్డ
నిర్జీవ పదార్థంలా...

బంతిపూలతో పుంతలుతొక్కే పెద్దవాగు
మూగదయింది
ఇంకిపోయిన ఎన్నెలయింది
అమ్మలక్కల బత్కమ్మబత్కమ్మ గానం
నిర్మానుష్య ఉరితాడుకు వేలాడుతోంది

పండుగదినం మా వాకిలికి
మాయమ్మ తానమాడించేది
పచ్చచీరగట్టేది
చీరంచు ఇడుపులకు
నగలు సింగారించేది
చేతులనిండా మైదాకువెట్టేది
ఇప్పుడు అమ్మలేదు
కరువు ప్రేమగా పిలిస్తే
వస్తున్నానంటూ వెళ్లిపోయింది

ఇప్పుడు వాకిలి...
సావుకు దగ్గరైన ముసలమ్మలా
నెత్తిమీద చేతులు పెట్టుకోని
దీనంగా గూసున్నది

మసకమసకగా కన్పించే
వీధిలైట్ల వెలుతురులో
కీటకాల్లా గుమిగూడేది
ఇప్పుడాలైట్లు
ఎడారిలో సూరీళ్లయ్యాయి
రాత్రంగా మేలుకుని
రాలుతున్న చుక్కల్ని లెక్కిస్తున్నాయి

తెలంగాణ దసరా ఇప్పుడు
పురావస్తు శాఖకూ
అలభ్య వస్తువు






## వేకువవేట

నెలవంకను బందూకు కొసకు తగిలించుకొని
వేకువ వేటకై బయలుదేరా
సూర్యోదయమయ్యేదాకా
సాగుతూనే ఉంటా
సమరశంఖం పూరించింది
ఆకలి కదా మరి!

ఔను
ఎండుటాకునే
నలిపివేయాలని చూస్తున్నావా?
ఒక్క క్షణం...
వెనక్కితిరిగి చూడు
పొడుచుకొస్తున్న చిగుళ్లని

వందల గుంటనక్కలైతేనేం
వేల నెత్తుటివాగులైతేనేం
ఆశయాల్ని శ్వాసిస్తూ
కెరటాలకు తలవంచని నావలా
తల ఎత్తుకునే ముందుకు సాగుతా
ఎండుటాకుల చిటపట
మండేగుండెల ధగధగ

నా బాటసాగే మిత్రులు
నను సాగనంపిన తల్లులు
ముళ్లబాట కదా!
ఆగే శ్వాసను నిలపడానికి

నువ్వుపెడుతున్న చిచ్చులు
ప్రళయాన్ని సృష్టిస్తాయనుకుంటున్నావేమో!
నా ఉద్యమం ఉమ్మితే ఆరిపోవాలి
అది
జీరవోయిన గొంతును మీటి వచ్చిందికదా...

ఇక చాలు నీ ఆగడాలు
కుయుక్తుల నినాదాలు

పారిన రక్తపుటేరులన్నీ
కంట్లో నెత్తుటి చారలై మొలుస్తున్నై
ఆగిన శ్వాసలన్నీ
ఆశయాలకై అరుస్తున్నై
చెమట చెమ్మగిల్లని కాలం కోసం
నా రక్తపుబొట్లనన్ని
ఆశయాలతో దండలల్లి
ఉద్యమానికి హారమేస్తా







## ఇగ బద్దెపూజనే

మొండిగోడా మొండిగోడా
ఏమయ్యిందే...
ఏం జెప్పమంటవ్ సాయన్నా
పెంకూలేదూ సూరూలేదు
కందికొయ్యనై నేనుతప్ప...

ఊరవిచ్చుకా ఊరవిచ్చుకా
ఏమయ్యిందే...
కొమ్మాలేదూ గూడూలేదూ
పలుగురాయినై నేనుతప్ప...

అరెరె
మల్లిగా నర్సిగా
చేతుల్ల పట్టుగోలలేందిరా
యాడికోతున్నర్రా...
చేన్ల బర్లు వడ్డయంట
బద్దెపూజ జెయ్యనీకె వోతున్నం
ఒరేయ్ చెంద్రిగా భీమిగా
ఏం జేస్తున్నర్రా...
బతుకును ఎవరో బజారు జేస్తుండ్రంట
కొడవండ్లు నూరుకుంటున్నం



# నోర్మంయ్...నేనెప్పుడూ ఉంటాను

'నీటికింద మంట పెట్టాను
ఆవిరైపోయిందికదా
ఇంకేం ఫరవాలేదు' అని
సంబరపడకు
అది మళ్ళీ మేఘమై వర్షిస్తుంది
'వెలుతురు పంచుతున్న సూరీడుని
కొండల వెనక్కి తోసేశాం కదా...
మనకిక ఎదురేలేదు' అని
చీకట్లో చిందులేయకు
మళ్ళీ ఉషోదయమవ్వక మానదు
'ప్రపంచానికి చూపునిచ్చే కళ్లను
పెకిలించిపారేసి
నేనే ఇక అన్నీ' అని
కపటనవ్వుల్ని విసరకు
ఆ కళ్లందించిన చూపుల్లో
కొత్తచూపులు పురుడు పోసుకోక మానవు
ప్రశ్నించిన చైతన్యాన్ని తెగనరికేసి



కత్తికంటిన పచ్చినెత్తురు వాసనను
హాయిగా పీల్చకు
తెగిపడ్డ శిరసు కన్న కలలు
తెగిపోలేవెపుడు
శ్వాసించిన ఆశయాలగాలి
నీ ఉచ్ఛ్వాసను వెంటాడుతుంది



# యుద్ధం పొదిగింది

చెకుముకిరాళ్ల గర్భంలో
ఉషోదయం పురుడుపోసుకుంటోంది
బోకిపెంకుల దాడిలో
స్మశానం దుప్పటి చిరుగుతోంది
కంకిపై వాలిన కాకిని
ఒడిశెల రాయి హెచ్చరిస్తోంది
నాగేటి సాళ్లనిండా ప్రవహిస్తున్న కన్నీరు
కంది కొయ్యై నిలుచుంది
సాలులో అడ్డమొచ్చిన రాళ్లగుండెల్లో
నాగలి దిగబడుతోంది
గడ్డిమొక్కలు నిప్పుమొగ్గలు తొడిగాయి
బీడువారిన భూమి
కత్తులపంటను చిగిర్చింది
ఆకుతేళ్లపై ఆకులు తిరగబడుతున్నాయి
చల్లని జాబిలమ్మ సైతం
చీకటితలపై
లావాతుంపర్లు కురుస్తోంది
ఎద్దుకాలిగిట్టల జ్ఞాపకాల తట్ట-మట్టిపెళ్ల
సాయుధమైన సమస్తంతో జతగూడుతోంది
నిన్న విత్తనం



నేడు మొలక
రేపు చెట్టు
యుద్ధం పొదిగింది
రేపో మాపో ఫలితం బయటికొస్తుంది
పాలపిట్ట స్వేచ్ఛగా ఎగురుతుంది
పచ్చని వీధుల నిండా
లేగదూడలు
చెంగుచెంగున దుంకుతాయి



## అసలు సంగతి

ఒక్కతల్లి బిడ్డలమంటున్నావు కదా!
మరి ఇవతలి రొమ్ము పాలనూ
అక్రమంగా తాగేస్తున్నావెందుకు?
ఈ నిజాన్ని కాదంటావా...
కావలిస్తే రికార్డు తల్లినడుగు
ఏం చెప్తుందో

అన్నదమ్ములమిద్దరం
కలిసే ఉండాలంటున్నావు కదా!
'అంతర్వివాహపద్ధతి' దుర్మార్గంలా
నాకిన్ని శిక్షలు ఎందుకు వేశావో చెప్పు?
ఒప్పుకోనంటావా...
కాలాన్నో గాయాల్నో అడుగు
వాస్తవ చరిత్రది అబద్ధపు నోరు కాదు కదా

'కలిసిఉంటే కలదు సుఖం'
నినదిస్తున్నావు కదా!
ఆ సుఖం నీకా నాకా?
అప్రకటిత విషయాల్నీ మాట్లాడాలి కదా
గుండెలు నోళ్లు తెరిచిన బీళ్లయిన
నాదగ్గర సుఖం ఉందా
నగ్నంగా నర్తిస్తున్న మాంసం ముద్దలపై
నోట్ల కట్టలు విసిరే




నీ దగ్గర సుఖం ఉందా
వాస్తవాల్ని గమనిస్తున్న ఆకాశాన్నే అడుగు
ఏం చెప్తుందో

భాష ఒక్కటి అన్నావు కదా
బతుకు స్మశానాల సంగతేమిటి?
సంస్కృతి ఒక్కటి అన్నావు కదా
అవాస్తవాలు లిఖించబడి
కన్నీరు మున్నీరవుతున్న కాగితాలపై
మా పండగేది?
మా బతుకుల్లో సంతోషాలు
గత స్మృతులెందుకయ్యాయి?
జాతి ఒక్కటన్నావు కదా!
మరి మీదీ దుర్భల జాతి కావాలి కదా?
నినాదాల వెనుక నిద్రిస్తున్న మోసాలు
ఎంజీబీఎస్ బస్టాండులో అడుక్కునే
పాలమూరు బిచ్చగానికి్కూడా తెలుసు సోదరా
నీవు నిలబెట్టిన నినాదాల్ని కాదు
నేను నిందిస్తున్నది
వాటికి ఆదర్శపు వయ్యారాలన్నీ ఉన్నాయి
కానీ
తీయనైన చక్కెర వెనుక
పళ్లికిలిస్తున్న మధుమేహం గురించి మాట్లాడుతున్నాన్నేను

విడిపోతే నక్సలిజం పెరుగుతుందంటావా
ఇక్కడేమిటి

గడ్డిమొక్కల్ని మేసే పశువుల్ని ఎదిరించడానికి
ఆరుద్రపురుగులు ఎక్కడైనా పుడతాయి
అది నీదగ్గరైనా...నా దగ్గరైనా...

విశాలాంధ్రకాదు
విశాల భావనతో చూడు
నాలుగు కోట్ల మనోఫలకాలపై
ఎన్ని స్మశానాలు చావుసంతకం చేశాయో!
చూపున్న గుడ్డివాడిలా కాకుండా
మనసున్న మా తమ్ముడిలా ఆలోచించు
నాది నాకివ్వు
నీది నువ్వు తీసుకో
నీది నాకేమీ వద్దు
నాదీ నువ్వేమీ తీసుకోవద్దు
నువ్వు నన్ను తెలంగాణోడన్నావు
నేను నిన్ను ఆంధ్రోడన్నాను
కలిసుండి విడిపోవడం కంటే
విడిపోయి కలిసుండడం సముచితం
నా మాట విను





## కుట్ర'జ'

జిల్లేడు విత్తనానికి
జిల్లేడు చెట్టే పూసింది
కాలం లిట్మస్ టెస్టులో
అనువంశికత నిరూపితం

గాయాలపై నూత్న గాయాలు చల్లుకుంటూ
విస్తరిల్లి ప్రవర్థిల్లిన క్రౌర్యానికి
ఓదార్పుగుణం జనించడం
వింతల్లోకెల్లా వింత

నెత్తుటిముద్దయిన ఆఫ్ఘాన్‌లో
కూల్చిన గోడల కింద చిక్కుకున్న
పసిప్రాణాల్ని చూసి
సామ్రాజ్యవాదాధినేత కంట్లోంచి కారిన నీరు
విషాద గీతికో...ఆనంద భాష్పమో...
బహిర్గత రహస్యమే

దోపిడీ దూసిన కత్తి
డొక్కలో దిగబడి
కొన్ని అల్పశ్వాసల నెత్తుటి వాయువు

అవిశ్రాంతంగా వీస్తున్న చోటిది
నెత్తుటిమడుగు చేసిన 'హస్తం'
నెత్తావి అవుతుందట
పాపాయీ నవ్వొస్తుంది కదూ!

బెంగుళూరు వ్యాపారబంధానికి
రెక్కవిరిగిన పావురాయిగోస
లేశమాత్రమైనా కన్పించదు
పుండుపై కారం చల్లడానికి
'కొండం'త చేయూత

ఒక్కో అడుగుతో
ఒక్కో స్మశానాన్ని ముద్రిస్తున్న పాదమా
దెబ్బతిన్న బెబ్బులి తోకపట్టి లాగటం
అంత మంచిదేం కాదు
ఓరుగల్లు యుద్ధవికసిత పుష్పం

వెళ్లిపో...
ప్రకృతి కన్నెర్రజెయ్యకముందే...

(మానుకోట మన్ను ఎగిరి వై.ఎస్. జగన్మోహన్ రెడ్డి కంట్లో పడ్డ సందర్భంలో...)





## మట్టిమాట

నేను మౌనంగా ఉన్నంతకాలమే
నీ నటనల దొంతర
నేను చరిత్ర పుటలు విప్పితే
నిలువునా కూలిపోతావ్
ఎన్ని అకాల మరణాలకు
నా అంతరంగ జగత్తు కల్లోలపడి ఉంటుంది
ఎన్ని వేడి నిట్టూర్పుల శబ్దాలకు
నా హృదయం లయతప్పి ఉంటుంది
నేను నోరు విప్పేదాకా చూడకు
ముందు నోరుమూసుకో

మా వాడు దుఃఖపడ్డప్పుడు
ఓదారుస్తూ వాకిలిగా ఉన్నా
మండుటెండలో నిటారుగా నిలబడి
అనాలోచితంగా ఆకాశంవైపు చూస్తున్నప్పుడు
బీడు భూమిగా ఉన్నా
కరువు కసితీరా తరుముతుంటే
వలసతీరం చేరుతున్నప్పుడు
పొలిమేర సంద్రమై పరుచుకున్నా
చావని నమ్మకం-ఇంటిపై ప్రేమా కలిసి
కాలానికి బెదరనివ్వనప్పుడు

పాడే శేషమై మిగిలిన నాడు
బొందై హృదయం తెరిచి హత్తుకున్నా
గాయాల చిట్టా విప్పితే
ఆకాశమంత కాగితమూ చాలదు
అమేజానంత శ్వాసా చాలదు
నా కడుపు లైబ్రరీ తెరిచి చూడు
పొరల అరల్లో
సజీవ సాక్ష్యాల్ని చెప్తే
ఎన్ని పుస్తకాలుంటాయో
నన్ను చికాకు పెట్టకు
ఒక్కొక్కడికి ఒక్కో 'సెప్టెంబర్ 2'లను ప్రసాదిస్తా

మా వాడి చెమటా నెత్తురుల్ని పీల్చి
డబ్బు సంచులు బుజానేసుకుని
చిరకాల స్వప్నాల్ని తుంచేస్తున్నావా
వాడికొక మిత్రుడుండాలి గుర్తుందా
నేనే...
మనిషికొక మట్టీ
మట్టికొక గొంతూ
గొంతుకొక గర్జనా
గర్జనలో యుద్ధం
ఉంటాయని మర్చిపోకు
చితి సిద్ధమౌతుంది సుమా!

**నోట్: సెప్టెంబర్ 2- వైయస్ రాజశేఖర్ రెడ్డికి ప్రకృతి మరణశిక్ష విధించిన రోజు.**





# ఎండుటాకే యుద్ధలేఖై....

ఉరితాడూ ఉరితాడూ
దయవుంచి నన్ను కరుణించవా
పగిలిన బోకిపెంకులా
ఎన్నాళ్లని ఉండను
నా గొంతునొకసారి కౌగిలించుకొని
నన్ను విముక్తున్ని చేయవా...
నాకు చేతకాదు బిడ్డా
నా బతుకంతా మీ బతుకుల్ని మోయడానికే సరిపోయింది
అక్కడేదో ఎర్రగా మెరుస్తోంది చూడు
అటువైపెళ్లు...

పురుగులమందూ పురుగులమందూ
నా శరీరాన్నొకసారి పావనం చేయవూ
జీవమున్న బూడిదలా ఎన్నొద్దులు గడపను
నా నరాల్లో నిండిన గాయాల మూట
గాడిదలా ఎంత బరువునని మోయను
నీవొకసారి నన్ను ప్రేమిస్తే
నేనూ మరణంలోని తీపిని రుచి చూస్తా
ఎంత మంది చావుదాహాన్ని తీర్చనురా
చేళ్లో పురుగులు మిగులుతున్నాయి
మీరేమో కరుగుతున్నారు
అక్కడేదో ధగధగ మండుతోంది చూడు
అటువైపెళ్లు

బొందమ్మా బొందమ్మా
ఎక్కడ తలవాలుద్దామన్నా
పదునుదేలిన కంకర్రాళ్లు
డొక్కల్లో గుచ్చుకుంటున్నాయి
నీ ఒడి సుతిమెత్తనిదని నీవైపొచ్చాను
నీ శత్రు ప్రేమతో నన్నొక్కసారి ఆలింగనం చేసుకోవూ...
నా హృదయంలో ఎంతమందికని చోటివ్వనురా
ఈ చావుగాడికసలు సిగ్గేలేదు
అందర్నీ నావైపే పంపుతున్నాడు
పో...
అక్కడేదో తూరుపుచెట్టు వికసిస్తున్నట్టుంది
అక్కడికెళ్లు...

వలసయ్యా వలసయ్యా
నిన్ను నేను వలచాను
ఏడడుగులూ నీతోనే నడవాలనీ
నా జీవితాన్ని నీ పాదాలవద్ద అర్పించాలనీ ఉంది
చావుకేకల వీణ నా గొంతు
మాధుర్యాన్ని విను
ఆశలు చచ్చిన...కన్నీళ్లింకిన నా కళ్లకాంతిని కను
బీడు భూములు పరుచుకున్న చెక్కిళ్లు చూడు
ఎముకలగూడు వెంట నీడలా పారిన
నా చర్మ సౌందర్యాన్ని చూడు
తోలుపిట్టలాంటి నా వయ్యారాలు చూడు
మొత్తంగా నా శవ అందాల్ని చూడు
అన్నీ నీకే అర్పిస్తా...తీసుకో...





ఛీ...ఛీ...పో అడగటానికి బుద్ధుండాలి
ఎన్ని పాదాలనని నా వైపు నడిపించుకుంటాను
మీవాళ్లంతా నా గూట్లోనే కదా ఉన్నది
నీకిక్కడ చోటులేదు పో
అక్కడేదో మెరుపులవాసనొస్తోంది చూడు
అటువైపెళ్లు...
పెట్రోలూ పెట్రోలూ
నా తాజా స్నేహితుడా
కన్నీటిచుక్కలా ఎంతదూరం ప్రయాణించను
నీవొకసారి నా దేహంతో కరచాలనం చేస్తే
తరించి అంతరించిపోతాను
నన్ను నీ అభయ హస్తంతో తడమవా
లోకం పంచిన బాధలకంటే
నీ మంటల్లో కాలిపోతూ
హాయిని అనుభవిస్తా
నా తల్లి భూమాత వద్ద
యుద్ధపాఠాలు నేర్వని అమాయకుడా
అక్కడేదో సంకెళ్ల విరుపు వినబడుతోంది విను
అక్కడికెళ్లు
ఏమిటీ...?
ఎవ్వరికీ నేను పట్టనా?
నా తాతను ప్రేమించారు!
నా తండ్రిని ప్రేమించారు!
నా తల్లిని ప్రేమించారు!
మా బతుకును ప్రేమించారు!
ఆఖరికి

ఆకలికి ఏడ్చిన మా చెల్లినీ ప్రేమించారు
నేనేనా వీరికి విసుగు
ఏమిటీ వీరు మూకుమ్మడిగా
నాకు చూపుతున్న చిరునామా
నాలుగడుగులు అపసవ్యంగా అటువైపేసి చూస్తే సరి!

ఎంత విచిత్రం
ఎండుటాకులే యుద్ధలేఖలై
నిప్పులు చెరుగుతున్నాయి
కాంతి పుంజాలు ఒక్కొక్కటి
విముక్తినొందుతున్నాయి
ఇదే బాగుంది...







# ప్రతిబింబం

మొన్న
ఆకాశపుటద్దంలో దృశ్యం...
ఆకురాలిన చెట్టొకటి కన్పించింది

నిన్న
అదే ఆకాశపుటద్దంలో దృశ్యం...
చెట్టు కొమ్మలూడి కన్పించింది

ఇవాళ
మళ్లీ ఒకమారు
ఆకాశపుటద్దంలో దృశ్యం...
చెట్టు పూర్తిగా కూలిపోయింది
అదేచోట...
ఒకపాట, ఒక పతాక, ఒక కాంతిపుంజం
జమిలిగా వికసిస్తూ కనిపించాయి

రేపటి దృశ్యాన్ని ఊహించగలను
పచ్చపచ్చటి ఆకులమధ్య
ఒక వరికంకి పువ్వునవ్వు

## అగ్గిపిట్ట

చిరుగుతున్న పేజీల్లో
అనంత విషాదం
చింపుతున్న చేతుల్లో
నిండైన కర్కషత్వం

రెండు గర్భిణీ మేఘాలు
పొలిమెరవతలి చేతుల్లో
పతంగులు...
వాటివైపే చూస్తూ
ఎండిన చెట్టు

నేల పగులు చీకట్లో
ఒక జీవచ్ఛవం మూలుగు
కాలానికొక ప్రశ్న

నిలబడిన పాదాలు
నిలబెట్టుకున్న నేల





పరస్పర రోదనా ఓదార్పు
ఓదార్పూ రోదన
బతుకు మునిగినపుట్టి
జ్ఞాపకాల నెత్తుటివాన
తడవటం కంటే
మరణమే వెచ్చనైన చోటు

ముళ్లగూటిలో
ఒక అగ్గిపిట్ట జననం
గాలి వానను చీల్చుకుంటూ
మెరుపులవైపు పయనం



జంగ్

## మోదుగుచెట్టు

అది మోదుగు చెట్టు
ఊరవతలి బొందలగడ్డలా
ఒక్కతే...

కరువైనా దానికి ఎరువే

కడుపులోని నీటిచలువ
ఆకాశంలోని మేఘమై ఎగిరిపోతున్నా
నిర్వీర్యమైపోక
ఎర్రగుండెలా నిలబడుతోంది

గుడిసెలోని జీవం
శవమై మిగిలినా
మరణాన్ని గేలిచేసే నిట్టాడులా
చూపులు నిలబెట్టుకునే ఉంది
దానిది ఫీనిక్స్ తనువు
తరతరాల చరిత్రలో
గాయమైన ప్రతిసారీ
నల్లని ఆకాశాన్ని ప్రతిఘటిస్తూ



నిప్పుమొగ్గలు తొడుగుతోంది
సూర్య శకలాలను
తనువంతా పూస్తోంది

కన్నీటి బిందువులోని రక్తకాసారాన్ని
నరనరాన నింపుకొని
అనేకానేక ప్రశ్నలకు సమాధానంగా
మోదుగు చెట్టు వికసిస్తోంది
ఎప్పటిలాగే...

